





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# శతక త్రయము





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంథాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

**Dwarkadheesh Vastu**

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

**Indian Epics in Telugu**

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శతక కవిత్వము

## ఒక వెలుగు బాట

'శతం ప్రమాణమ్ అస్య శతకమ్' అనునది పెద్దల నిర్వచనము. అనగా వంద పద్యములుగల పద్యసమూహమునకు 'శతకము' అని ప్రసిద్ధి. ఇందుగల అన్ని పద్యములలోను పద్యము యొక్క చివరిభాగమున 'మకుటము' ఉండుట ఒక సంప్రదాయము. సుమతీ!, కృష్ణా!, దాశరథీ!, భాస్కరా! మొదలగునవి మకుటాలు. పెక్కు శతకములు ఇట్టి మకుటములను కలిగియున్నవి. సంస్కృత కవులు తమ శతకములలో ఈ మకుటనియమమును అంతగా పాటింపలేదు. వారి పద్ధతిని అనుసరించి కొంతమంది తెలుగు కవులు గూడ ఈ నియమమును నడుపలేదు. ఏనుగు లక్ష్మణకవి మొదలగువారు వ్రాసిన నీతి, శృంగార, వైరాగ్య శతకములలో ఈ మకుట నియమము కనబడదు. కొన్ని శతకములలోని పద్యములు నూటికి మించియున్నవి. అనగా ఆ కవులు సంఖ్యానియమమును పాటింపలేదన్నమాట. విశ్వదాభిరామ! వినురవేమ! అను మకుటముతో ఒప్పుచు 'వేమన శతకము' అను పేరుతో ప్రసిద్ధి కెక్కినను అందలి పద్యముల సంఖ్య వేలకు చేరినది. దీనిని బట్టి 'వేమన' మొదలగు కవులు ఈ సంఖ్యానియమమును పాటింపలేదనుట స్పష్టము.

శతకములు మొదట భక్తి రచనలుగా సాగినవి. కవులు తమ వేదనలను తమ తమ ఇష్టదైవములకు తెలుపుకొనుట ఇందుకనబడును. శతకములు అన్నియును కవుల యొక్క భావావేశములకు మచ్చుతునకలు- సంస్కృతము నందలి శతకముల సంఖ్య పరిమితము. తెలుగులో శతకములు కొల్లలుగా రచింపబడినవి. తెలుగు శతకములలో ఎక్కువభాగము ఉత్పలమాల, మొదలగు వృత్తములలో నడచినవి. మరికొన్ని కందము, ఆటవెలది తేటగీతి మొదలగు పద్యములలో రచింపబడినవి. వీటితో పోల్చినప్పుడు సీసపద్యములతో రచింపబడిన శతకముల సంఖ్య తక్కువ. తెలుగు వారిలో ప్రతికవియు మొట్టమొదట శతకమును రచించిన పిమ్మటనే కావ్య రచనకు పూనుకొనినట్లు సాహిత్య వేత్తలు భావింతురు. వారి వారి కావ్యరచనలకు ఈ శతకములు తొలిమెట్లు.

ఈ శతకములలో ప్రతిపద్యము స్వతంత్రముగా సాగును. మొదటినుండి చివరివఱకు ఒకే వస్తువు ఉండదు. అందువలన ఈ శతక పద్యాలను 'ముక్తకములు' అనియు కొందఱు భావింతురు. కనుక ఒక పద్యముతో మఱియొక దానికి సంబంధమే యుండదు. నాడేగాదు, నేడేగాని, ఏనాడైనాగాని వ్యక్తుల జీవితాలలో తాత్కాలిక సుఖాలేగాని శాశ్వతానందము శూన్యమే. కావున భగవంతుని ఆశ్రయించినచో ఆయన అనుగ్రహముతో కష్టాలు తొలగి శాశ్వతముగా ఆనందము ప్రాప్తించునని ఆస్తికుల విశ్వాసము. కాబట్టి దైవభక్తిగల కవులు భక్తిరీతులలో ఈ శతకములను రచించి, తాము శాంతిని పొంది, వీటిని లోకమునకు అందించిరి. ఫలితముగా ఈ రచనలను పఠించుట ద్వారా జనులు పరమానందమును పొందసాగిరి. ఈ విధముగా శతకములు లోకమున చిరస్థాయిని సంపాదించినవి.

శతకములు మొదట భక్తిపరములై నడచినను క్రమముగా ఇవి సంఘములోని చెడులను తొలగించుటకును సాధనములైనవి. గర్వముతో కనులు మూసికొని పోయిన రాజుల నిరంకుశ ధోరణులను, సంపన్నుల దురహంకారములను, స్వార్థపరుల దుర్మార్గములను, సంప్రదాయము పేరుతో సాగుచున్న దురాచారములను ప్రకటించుచు లోకమునకు కనువిప్పుగావించుటకు పూనుకొనినవి. ఈ రీతిగా రూపొందిన శతకములు దుష్టులలో గుబులు పుట్టించినవి, సామాన్యులు నలుగురిలో కంఠము విప్పి మాట్లాడుటకు చేయూతనిచ్చినవి. సమాజ పరివర్తనకు ప్రత్యక్షముగా, పరోక్షముగా మిగుల తోడ్పడినవి. ధర్మము ముసుగులో సజ్జనులుగా చెలామణి అగుచున్న పెద్ద మనుష్యుల పెడబుద్ధులకు కళ్లెము వేసినవి. ఇంత ఎందులకు క్రమక్రమముగా ప్రభువుల శాసనములకంటెను ఈ శతకముల అనుశాసనములే ప్రజలకు శిరోధార్యములైనవి. ఈ శతకములు మంచి విలువలకు అండగా నిలిచి కొనసాగుట నిజముగా లోకమునకు 'శ్రీరామ రక్ష'.

* * *

# సుమతి శతకము



దీనిని రచించినవాడు 'బద్దెన'. ఇందలి పద్యములు అన్నియును కందములే. రచన సరళము, సుందరము, చిఱుత ప్రాయమునందలి బాల బాలికలకును ఇది సులభముగా బోధపడును. పిన్నలకును, పెద్దలకును ఈ శతకముపైగల గౌరవాభిమానములు సాటిలేనివి. ఒక్కమాటలో చెప్పవలెనన్న ఇది 'తెలుగు వారికి ఇలవేల్పు.'

ఇందు ధారాళమైన నీతులు నోరూరించుచు తెలుపబడినవి. ఇవి బాలబాలికలు, స్త్రీలు పురుషులు అందఱును ఆకళింపు చేసికొని తమతమ జీవితములలో పాటింపవలసినవి. (1) అక్కఱకురాని చుట్టమును విడువవలెను, (2) అడవిలో తోడు లేకుండ ఒంటరిగా వెళ్లరాదు. (3) అప్పుచేసి విలాసములకు దిగుట మంచిది కాదు. (4) కష్టాలు వచ్చినప్పుడు వాటిని ఓర్చుకొనినవాడే గొప్పవాడు. (5) వాదులాటకు దిగితే కీడు తప్పదు. (6) అపకారికిని ఉపకారము చేయుట గొప్ప విషయము. (7) సమయమునకు తగినట్లుగా మాట్లాడుట, ఇతరుల మనస్సులను నొప్పింపకుండట ఒక నేర్పు. (8) ఎప్పుడును తప్పులు వెదకెడు వానిని సేవించుట పాము పడగ నీడను ఆశ్రయించుటయే. (9) సంపదలు కలిగినచోట బంధువులు గుంపులు గుంపులుగా చేరుదురు. (10) గురువుయొక్క ఆజ్ఞను మీఱుట, బంధువులను దూషించుట దోషము. (11) కలిమి లేములు శాశ్వతములు కావు. (12) ఇల్లాలు కన్నీరు పెట్టినచో ఆ ఇంటిలో సిరి ఉండదు. (13) తాను తినక, ఇతరులకు పెట్టక కూడ బెట్టిన ధనము రాజుల (పాలకుల) పాలేయగును. (14) కోపము శత్రువువంటిది, శాంతము రక్షాకవచము, సంతోషమే స్వర్గము. మొదలగు జీవన సూత్రాలు ఇందు కోకొల్లలు.

ఇక చదువుట, రుచిచూచుట - మీ పని -

క. శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా
ధారాళమైన నీతులు
నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ 1

క. అక్కఱకు రాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమునఁ దా
నెక్కినఁ బాఱని గుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ 2

క. అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొల్చి మిడుకుటకంటెన్
వడిగల యెద్దులఁ గట్టుక
మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ 3

క. అడియాస కొలువుఁ గొలువకు
గుడిమణియము సేయఁబోకు కుజనులతోడన్
విడువక కూరిమి సేయకు
మడవిని దోడరయకొంటి నరుగకు సుమతీ 4

క. అధరము కదలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుఁడౌ
నధికారరోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ బాపము సుమతీ 5

క. అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు,
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును, ద్విజుఁడున్

జొప్పడిన యూర మండుము,
చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ  6

క. అప్పుగొని చేయువిభవము
ముప్పునఁ బ్రాయంపుటాలు మూర్ఖునితపమున్
దప్పరయని నృపురాజ్యము,
దెప్పరమై మీదఁ గీడు దెచ్చుర సుమతీ  7

క. అల్లునిమంచితనంబును
గొల్లనిసాహిత్యవిద్య కోమలినిజమున్
బొల్లున దంచినబియ్యముఁ
దెల్లని కాకులును లేవు తెలియర సుమతీ  8

క. ఆఁకొన్నకూడె యమృతము
తాఁకొందక నిచ్చువాఁడె దాత ధరిత్రిన్
సోఁకోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువ గలవాఁడె వంశతిలకుఁడు సుమతీ  9

క. ఇచ్చునదె విద్య, రణమునఁ
జొచ్చునదే మగతనంబు, సుకవీశ్వరులున్
మెచ్చునదె నేర్పు, వాదుకు
వచ్చునదే కీడుసుమ్ము వసుధను సుమతీ  10

క. ఇమ్ముగఁ జదువని నోరును,
నమ్మా యని పిలిచి యన్నమడుగని నోరున్
తమ్ములఁ బిలువని నోరును
గుమ్మరి మనుఁ ద్రవ్వినట్టి గుంటర సుమతీ.  11

క. ఉడుముండదె నూఱేండ్లును
బడియుండదె పేర్మిఁ బాము పదినూఱేండ్లున్

మడువునఁ గొక్కెర యుండదె
కడు నిలఁ బురుషార్థపరుఁడు కావలె సుమతీ 12

క. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగనేర్చు? నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగఁబోసిన
నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ 13

క. ఉదకముఁ ద్రావెడు హయమును
మదమున నుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవుకడ నున్న వృషభముఁ
జదువని యా నీచుఁ జేరఁ జనకుర సుమతీ 14

క. ఉపకారికి నుపకారము
విపరీతము కాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ 15

క. ఉపమింప మొదట తియ్యన
కపటం బెడనెడను జెఱకుకైవడినే పో
నెపములు వెదకును గడపటఁ
గపటపు దుర్జాతిపొందు గదరా సుమతీ 16

క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికామాటలాడి యన్యులమనముల్
నొప్పింక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ 17

క. ఎప్పుడు తప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁ గూడదది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించినవిధంబె గదరా సుమతీ 18

క. ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తురది యెట్లన్నన్
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలు చేరుఁ గదరా సుమతీ 19

క. ఏఱకుమీ కసుగాయల
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువునాజ్ఞ మేదిని సుమతీ 20

క. ఒక యూరికి నొక కరణము
నొక తీర్పరి యైనఁగాక నొగిఁ దఱచైనన్
గకవికలు గాక యుండునె?
సకలంబును గొట్టువడక సహజము సుమతీ 21

క. ఒల్లని సతి నొల్లని పతి
నొల్లని చెలికాని విడువ నొల్లనివాడేఁ
గొల్లండు కాక ధరలో
గొల్లండును గొల్లఁడౌనె గుణమున సుమతీ 22

క. ఓడల బండ్లును వచ్చును
ఓడలు నా బండ్లమీఁద నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లును వలెనే
వాడంబడుఁ గలిమి లేమి వసుధను సుమతీ 23

క. కడు బలవంతుండైననుఁ
బుడమిని బ్రాయంపుటాలిఁ బుట్టినయింటన్
దడవుండనిచ్చె నేనియుఁ
బడుపుగ నంగడికిఁ దానె పంపుట సుమతీ 24

క. నమ్మకు సుంకరి జూదరి
నమ్మకుమగసాలివాని నటు వెలయాలిన్
నమ్మకుమంగడివానిని
నమ్మకు మఱి వామహస్తు నవనిని సుమతీ 25

క. కప్పకు నొరగాలైనను,
సర్పమునకు రోగమైన, సతి తులువైనన్
ముప్పున దరిద్రుఁడైనను
తప్పదు మఱి దుఃఖమగుట తథ్యము సుమతీ 26

క. కమలములు నీటఁబాసినఁ
గమలాప్తునిరశ్మి సోఁకి కమలినభంగిన్
దమ తమ నెలవులు దప్పినఁ
దమమిత్రులె శత్రులగుట తథ్యము సుమతీ 27

క. కరణముఁ గరణము నమ్మిన
మరణాంతకమౌను గాని మనలేఁడు సుమీ
కరణము దనసరికరణము
మఱి నమ్మక మర్మమీక మనవలె సుమతీ 28

క. కరణముల ననుసరింపక
విరసంబునఁ దిన్న తిండి వికటించుఁ జుమీ
యురుమునఁ గందెనఁ బెట్టక
పరమేశ్వరు బండియైనఁ బాఱదు సుమతీ 29

క. కరణము సాధై యున్నను
గరి మదముడిగినను బాము గఱవక యున్నన్
ధరఁ దేలు మీటకున్నను
గరమరుదుగ లెక్క గొనరు గదరా సుమతీ 30

క. కనుగాయఁ గఱచి చూచిన
మసలక దన యొగరుగాక మధురంబగునా?
పసగలుగు యువతులుండఁగఁ
బసి బాలలఁ బొందువాఁడు పసరము సుమతీ 31

క. కవికానివాని వ్రాతయు
నవరసభావములు లేని నాతులవలపున్
దవిలి చను పందివేయని
వివిధాయుధకౌశలంబు వృథరా సుమతీ 32

క. కాదన్నవాఁడె కరణము
వాదడచినవాఁడె పేడి వసుధేశుకడన్
లేదన్నవాఁడె చనవరి
గాథలు పెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ 33

క. కాదు సుమీ దుస్సంగతి
పోదు సుమీ కీర్తికాంత పొందినపిదపన్
వాదు సుమీ యప్పిచ్చుట
లేదు సుమీ సతులవలపు లేశము సుమతీ 34

క. కారణములేని నగవును
బేరణమునులేని లేమ పృథివీస్థలిలోఁ
బూరణములేని బూరెయు
వీరణములులేని పెండ్లి వృథరా సుమతీ 35

క. కులకాంతతోడ నెప్పుడుఁ
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠకంఠికన్నీ
రొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ 36

క. కూరిమి గల దినములలో
నేరము లెన్నఁడును గలుగనేరవు మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ 37

క. కొంచెపునరుసంగతిచే
నంచితముగఁ గీడు వచ్చు నది యెట్లన్నన్
గించిత్తు నల్లి కుట్టిన
మంచమునకుఁ బెట్లు వచ్చు మహిలో సుమతీ 38

క. కొఱగాని కొడుకు పుట్టినఁ
గొఱగామియె కాదు తండ్రిగుణములఁ జెఱచున్
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకునఁ దీపెల్లఁ జెఱచు సిద్ధము సుమతీ 39

క. కోమలి విశ్వాసంబును
బాములతోఁ జెలిమి యన్య భామలవలపున్
వేముల తియ్యఁదనంబును
భూమీశుల నమ్మికలును బొంకుర సుమతీ 40

క. గడనగల మగనిఁ జూచిన
నడుగులకును మడుగులిడుదు రతివలు తమలో
గడనుడుగుమగనిఁ జూచిన
నడపీనుఁగు వచ్చె ననుచు నగుదురు సుమతీ 41

క. చింతింపకు గడచినపని
కింతులు వలతురని నమ్మకెంతయు మదిలో
నంతఃపురకాంతలతో
మంతనములు మానుమిదియె మతముర సుమతీ 42

క. చీమలు పెట్టినపుట్టలు
పాములకిరవైనయట్లు పామరుఁడు తగన్
హేమంబు కూడఁ బెట్టిన
భూమీశులపాలఁ జేరు భువిలో సుమతీ 43

క. చుట్టములు గాని వారలు
చుట్టములము నీకటంచు సొంపు దలిర్పన్
వెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగఁ గదరా సుమతీ 44

క. చేతులకుఁ దొడవు దానము
భూతలనాథులకుఁ దొడవు బొంకమి ధరలో
నీతియ తొడవెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ 45

క. తడవోర్వక యొడలోర్వక
కడువేగం బడిచిపడిన కార్యం బగునే
తడవోర్చిన నొడలోర్చిన
చెడిపోయిన కార్యమెల్లఁ జేకురు సుమతీ 46

క. తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌఁ
దనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ 47

క. తనయూరితపసితపమును
తనపుత్రునివిద్యపెంపుఁ దనసతిరూపున్
తనపెరటిచెట్టుమందును
మనసున వర్ణింపరెట్టి మనుజులు సుమతీ 48

క. తనకలిమి యింద్రభోగము
తనలేమియె సర్వలోకదారిద్ర్యంబున్
తనచావు జగత్ప్రళయము
తనవలచినయదియె రంభ తథ్యము సుమతీ 49

క. తనవారు లేనిచోటను
జనవించుక లేనిచోట జగడముచోటన్
అనుమానమైనచోటను
మనుజునకున్ నిలువఁదగదు మహిలో సుమతీ 50

క. తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకున్
తల తోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ 51

క. తల మాసిన నొలుమాసిన
వలువలు మాసినను బ్రాణవల్లభునైనన్
గులకాంతలైన రోఁతురు
తిలకింపగ భూమిలోనఁ దిరముగ సుమతీ 52

క. తానమభవింపనర్థము
మానవపతిఁ జేరుఁ గొంత మఱి భూగతమౌఁ
గానల వీఁగలు గూర్చిన
తేనియ యొరుఁ జేరునట్లు తిరముగ సుమతీ! 53

క. దగ్గఱ కొండెము చెప్పెడు
ప్రెగ్గడపలుకులకు రాజు ప్రియుఁడై మఱి తా
నెగ్గు ప్రజకాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట సుమతీ 54

క. ధనపతిసఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్షమెత్తఁగ వలసెన్
దనవారికెంత గలిగినఁ
దన భాగ్యమె తనకుఁగాక తథ్యము సుమతీ 55

క. ధీరులకుఁ జేయుమేలది
సారంబగు నారికేళసలిలముభంగిన్
గౌరవమును మఱి మీఁదట
భూరిసుఖావహమునగును భువిలో సుమతీ 56

క. నడువకుమీ తెరువొక్కటఁ
గుడువకుమీ శత్రునింటఁ గూరిమి తోడన్
ముడువకుమీ పరధనములు
నుడువకుమీ యొరులమనసు నొవ్వఁగ సుమతీ 57

క. నయమునఁ బాలుం ద్రావరు
భయమునను విషమ్మునైన భక్షింతురుగా
నయమెంత దోషకారియొ
భయమే చూపంగవలయు బాగుగ సుమతీ 58

క. నరపతులు మేరఁ దప్పినఁ
దిరమొప్పఁగ విధవ యింటఁ దీర్పరి యైనన్
గరణము వైదికుఁడైనను
మరణాంతకమౌను గాని మానదు సుమతీ 59

క. నవరసభావాలంకృత
కవితాగోష్ఠియును మధురగానంబును దా
నవివేకికెంతఁ జెప్పినఁ
జెవిటికి సంకూదినట్లు సిద్ధము సుమతీ 60

క. నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లి-దండ్రి-నాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయమిది సుమతీ 61

క. నీరే ప్రాణాధారము
నోరే రసభరితమైన నుడువులకెల్లన్
నారియె నరులకు రత్నము
చీరయె శృంగారమండ్రు సిద్ధము సుమతీ! 62

క. పగ వలదెవ్వరితోడను
వగవంగా వలదు లేమి వచ్చినపిదపన్
దెగనాడవలదు సభలను
మగువకు మనసియ్యవలదు మహిలో సుమతీ 63

క. పతికడకుఁ దన్నుఁ గూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ 64

క. పనిచేయునెడల దాసియు,
ననుభవమున రంభ, మంత్రి యాలోచనలన్,
దన భుక్తియెడలఁ దల్లియు
ననఁ దన కులకాంత యుండనగురా సుమతీ 65

క. పరనారీసోదరుఁడై
పరధనములకాసపడక పరులకు హితుఁడై
పరులు దనుఁ బొగడ నెగడియుఁ
బరులలిగిన నలుగనతఁడు పరముఁడు సుమతీ 66

క. పరసతికూటమిఁ గోరకు,
పరధనముల కాసపడకు, పరునెంచకుమీ,
సరిగాని గోష్ఠి సేయకు,
సిరి చెడి చుట్టంబుకడకుఁ జేరకు సుమతీ 67

క. పరసతులగోష్ఠినుండిన
పురుషుఁడు గాంగేయుఁడైన భువి నిందపడున్
బరసతి సుశీల యైనను
బరుసంగతినున్న నిందపాలగు సుమతీ 68

క. పరునాత్మఁ దలఁచుసతి విడు
మఱుమాటలు పలుకుసుతుల మన్నింపకుమీ
వెఱపెఱుఁగని భటునేలకు
తఱచుగ సతిఁ గవయఁబోకు తగదుర సుమతీ 69

క. పరులకనిష్టము సెప్పకు
పొరుగిండ్లకుఁ బనులులేక పోవకుమెపుడున్
ఒరుఁ గదిసినసతిఁ గవయకు
మెఱిఁగియు బిరుసైన హయము నెక్కకు సుమతీ 70

క. పర్వముల సతులఁ గవయకు,
ముర్వీశ్వరుకరుణ నమ్మి యుబ్బకు మదిలో,
గర్వింప నాలిఁ బెంచకు
నిర్వాహము లేనిచోట నిలువకు సుమతీ 71

క. పలుదోమి సేయు విడియము
తల గడిగిన నాఁటి నిద్ర తరుణుల తోడన్
బొలయలుకనాఁటి కూటమి
వెలయింతని చెప్పరాదు వినురా సుమతీ 72

క. పాటెఱుఁగని పతికొలువును
కూటంబున కెఱుకపడని కోమలిరతియున్
బేఁటెత్తఁజేయు చెలిమియు
నేఁటికి నెదురీఁదినట్టులెన్నర సుమతీ 73

క. పాలను గలిసిన జలమును
పాలవిధంబుననె యుండుఁ బరికింపంగాఁ
బాల చవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁడగువానిపొందు వలదుర సుమతీ 74

క. పాలసునకైన యాపద
జాలింబడి తీర్పఁ దగదు సర్వజ్ఞునకున్
దేలగ్నిఁ బడఁగఁ బట్టిన
మేలెఱుఁగునె మీటుఁగాక మేదిని సుమతీ 75

క. పిలువని పనులకుఁ బోవుట,
గలయనిసతిరతియు, రాజు గాననికొలువున్,
బిలువనిపేరంటంబును,
వలవనిచెలిమియును చేయవలదుర సుమతీ 76

క. పుత్రోత్సాహము తండ్రికిఁ
బుత్త్రుఁడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్త్రునిఁ గనుఁగొని పొగడఁగఁ
బుత్త్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ 77

క. పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనన్
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ సిద్ధము సుమతీ 78

క. పెట్టినదినములలోపల
నట్టడవులకైన వచ్చు నానార్థములున్
పెట్టనిదినములఁ గనకపు
గట్టెక్కిన నేమి లేదు గదరా సుమతీ 79

క. పొరుగునఁ బగవాఁడుండిన
నిరవొందఁగ వ్రాతఁకాఁడె యేలిక యైనన్
ధరఁ గాఁపు కొండెమాడినఁ
గరణాలకు బ్రతుకు లేదు గదరా సుమతీ 80

క. బంగారు కుదువఁ బెట్టకు
సంగరమునఁ బాఱిపోకు సరసుఁడవైనన్,
అంగడి వెచ్చము లాడకు
వెంగలితోఁ జెలిమి వలదు వినురా సుమతీ 81

క. బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ 82

క. మండలపతిసముఖంబున
మెండైన ప్రధాని లేక మెలగుట యెల్లన్
గొండంత మదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు దోచుర సుమతీ 83

క. మంత్రిగలవానిరాజ్యము
తంత్రము చెడకుండ నిలుచుఁ దఱచుగ ధరలో
మంత్రివిహీనుని రాజ్యము
జంత్రపుఁ గీలూడినట్లు జరగదు సుమతీ 84

క. మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ 85

క. మానఘనుఁడాత్మ ధృతిసెడి
హీనుండగువాని నాశ్రయించుట యెల్లన్
మానెఁడు జలములలోపల
నేనుఁగు మెయి దాఁచినట్టు లెఱుఁగుము సుమతీ 86

క. మేలెంచని మాలిన్యుని
మాలను నగసాలివాని మంగలి హితుఁగా
నేలిన నరపతిరాజ్యము
నేలఁ గలిసిపోవుఁ గాని నెగడదు సుమతీ 87

క. రా పొమ్మని పిలువని యా
భూపాలునిఁ గొల్వ భుక్తిముక్తులు గలవే
దీపంబు లేని యింటను
చేపుణికిళ్ళాడినట్లు సిద్ధము సుమతీ 88

క. రూపించి పలికి బొంకకు,
ప్రాపగు చుట్టంబు నెగ్గు పలుకకు, మదిలోఁ
గోపించురాజుఁ గొల్వకు,
పాపపు దేశంబు సొఱకు, పదిలము సుమతీ 89

క. లావు గలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁడెక్కినట్లు మహిలో సుమతీ 90

క. వరిపంట లేనియూరును,
దొర యుండనియూరు, తోడు దొరకని తెరువున్.
ధరను బతి లేనిగృహమును,
వరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ 91

క. వఱపైన చేను దున్నకు
కఱవైనను బంధుజనులకడ కేగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళావాయితనము బెట్టకు సుమతీ 92

క. వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతన వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజము తెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ 93

క. పీడెము సేయని నోరును
జేడెలయధరామృతంబు జెందని నోరున్
పాడంగ రాని నోరును
బూడిదకిరవైన పాడుబొందర సుమతీ 94

క. వేసరపు జాతిగానీ
వీసముఁ దాఁజేయనట్టి వీఱిఁడి గానీ
దాసికొడుకైనఁ గానీ
కాసులు గలవాఁడె రాజుగదరా సుమతీ 95

క. శుభముల నొందని చదువును
అభినయముగ రాగరసము నందని పాటల్
అభిలాష లేనికూటమి
సభ మెచ్చని మాటలెల్ల చప్పన సుమతీ 96

క. సరసము విరసము కొఱకే
పరిపూర్ణ సుఖంబు లధిక బాధల కొఱకే
పెరుగుట విరుగుట కొఱకే
ధర తగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ 97

క. సిరి దా వచ్చిన వచ్చును
సరసంబుగ నారికేళ సలిలము భంగిన్
సిరిదాఁ బోయినఁ బోవును
కరి మ్రింగిన వెలగపండుకరణిని సుమతీ 98

క. స్త్రీలయెడ వాదులాడకు
బాలురతో చెలిమి చేసి భాషింపకుమీ
మేలైన గుణము విడువకు
యేలిన పతినింద సేయకెన్నఁడు సుమతీ. 99

క. కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁ బెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను వినురా సుమతీ 100

* * *

# శ్రీకృష్ణ శతకము



ఇది కంద పద్యములలో మధురముగా సాగిన భక్తి రచన- 'కృష్ణా!' అనునది ఈ శతకమునకు మకుటము- శ్రీకృష్ణుని లీలలు ఇందు సులభశైలిలో చక్కగా వర్ణింపబడినవి.

'నమ్మి కొలిచినవారికి తల్లియు, తండ్రియు, గురుడు, పతియు, గతియు అన్నియును భగవంతుడే సుమా!- 'హరి' అను రెండక్షరములను స్మరించినచో వాని పాపములు అన్నియును పటాపంచలగును' - అని ఇందు తెలుపబడినది. చుక్కలను, భూమి రేణువులను, లెక్కింపగలమేమోగాని భగవంతుని గుణములను లెక్కపెట్టుట అసాధ్యము. సృష్టి, స్థితి, లయములకు కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురును ఆ భగవంతుని రూపములే - మున్నగు రీతిలో భగవంతుని వైభవము ప్రస్తుతింపబడినది.

పూతనను చంపుట, శకటాసురుని తుదముట్టించుట, తృణావర్తునకు బుద్ధి చెప్పుట - కాళియ సర్పము యొక్క మదమణచుట, యశోదానందుల ముందును, గోపికల ఇండ్లలోను చిత్ర విచిత్రములైన తన బాల్యలీలలను ప్రకటించుట, గోవర్ధనగిరినెత్తి వడగండ్లవానప్రమాదమునుండి గోవులను, గోపికలను, గోపాలురను రక్షించుట, మల్లురను మట్టిగఅపించుట, కంసుని హతమార్చుటమొదలైన శ్రీకృష్ణావతారవైభవఘట్టములు ఇందు మనోహరముగా ప్రస్తావింపబడినవి. ఆర్తిగొని భక్తితో శ్రీకృష్ణభగవానుని కీర్తించిన ఘట్టములు పరమానందదాయకములు.

ఇక పఠించి పరవశించిపోవుట పాఠకుల వంతు

॥ శ్రీ పరమాత్మనే నమః ॥

శ్రీ రుక్మిణీశ! కేశవ!
నారద సంగీతలోల! నగధర! శౌరీ!
ద్వారక నిలయ! జనార్దన!
కారుణ్యముతోడ మమ్ము గావుము కృష్ణా! 1

నీవే తల్లివి తండ్రివి
నీవే నాతోడు నీడ నీవే సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! 2

నారాయణ! పరమేశ్వర!
ధారాధర నీలదేహ! దానవవైరీ!
క్షీరాబ్ధిశయన! యదుకుల
వీరా! నను గావు కరుణ వెలయగ కృష్ణా! 3

హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా!
హరి నీ నామమహత్త్వము
హరిహరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా! 4

క్రూరాత్ముఁ డజామీళుడు
నారాయణ యనుచు నాత్మనందను బిలువన్
ఏరీతి నేలుకొంటివి
యేరీ నీసాటి వేల్పు లెందును కృష్ణా! 5

చిలుక నొక రమణి ముద్దుల
చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతి పేరం
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ మిము దలచు జనుల కరుదా కృష్ణా! 6

అక్రూరవరద! మాధవ!
చక్రాయుధ! ఖడ్గపాణి! శౌరి! ముకుందా!
శక్రాది దివిజసన్నుత
శుక్రార్చిత! నన్ను కరుణ జూడుము కృష్ణా! 7

నందుని ముద్దుల పట్టిని
మందరగిరిధరుని హరిని మాధవు విష్ణున్
సుందరరూపుని మునిగణ
వందితు నినుదలతు భక్తవత్సల కృష్ణా! 8

ఓ కారుణ్యపయోనిధి!
నా కాధారంబవగుచు నయముగ బ్రోవన్
నాకేల యితర చింతలు
నాకాధిపవినుత! లోకనాయక! కృష్ణా! 9

వేదంబులు గననేరని
ఆది పరబ్రహ్మమూర్తివనఘ మురారీ!
నా దిక్కు చూచి కావుము
నీ దిక్కే నమ్మినాడ నిజముగ కృష్ణా! 10

పదునాలుగు భువనంబుల
కుదురుగ నీకుక్షి నిలుపుకొను నేర్పరివై
విదితంబుగ నా దేవకి
యుదరములో నెట్టులొదిగి యుంటివి కృష్ణా! 11

అష్టమి రోహిణి ప్రొద్దున
అష్టమ గర్భమున బుట్టి యా దేవకికిన్,
దుష్టుని కంసు వధింపవె
సృష్టి ప్రతిపాలనంబు సేయగ కృష్ణా! 12

అల్ల జగన్నాథుకు ప్రే
పల్లియ క్రీడార్థమయ్యె పరమాత్మునకున్
గొల్లసతి యా యశోదయు
తల్లియునై చన్నుగుడిపె దనరగ కృష్ణా! 13

అందెలు గజ్జెలు మ్రోయగ
చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా
నందుని సతి యా గోపిక
ముందర నాడుదువు మిగుల మురియుచు కృష్ణా! 14

హరిచందనంబు మేనున
కరమొప్పెడు హస్తములను కంకణరవముల్
ఉరమున రత్నము మెఱయగ
బరగితివో నీవు బాలప్రాయము కృష్ణా! 15

పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయగ పింఛం
బాణీ ముత్యము ముక్కున
నాణెముగా దాల్చు లోకనాథుడ! కృష్ణా! 16

మడుగుకు జని కాళీయుని
పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్
కడు వేడుకతో నాడెడు
నడుగులు నామదిని దలతు నచ్యుత! కృష్ణా! 17

బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణునాదము నీ వా
మందార మూలమున గో
విందా! పూరింతువౌర వేడుక కృష్ణా! 18

వారిజనేత్రలు యమునా
వారిని జలకంబులాడ వచ్చిన నీ వా
చీరలు ముచ్చిలి యిచ్చితి
నేరుపురా యదియు నీకు నీతియె కృష్ణా! 19

దేవేంద్రు డలుకతోడను
వావిరిగా ఱాళ్ళవాన వడి గురియింపన్
గోవర్ధనగిరి యెత్తితి
గోవుల గోపకుల గాచుకొఱకై కృష్ణా! 20

అండజవాహన! విను బ్ర
హ్మాండంబుల బంతులట్ల యాడెడి నీ వా
కొండల నెత్తితివందురు
కొండిక పనిగాక దొడ్డకొండా కృష్ణా! 21

అంసాలంబితకుండల!
కంసాంతక! నీవు ద్వారకాపురిలోనన్
సంసారిరీతి నుంటివి
హంసేంద్ర! విశాలనేత్ర! అచ్యుత కృష్ణా! 22

పదియాఱువేల నూర్వురు
సుదతులు నెనమండ్రు నీకు సొంపుగ భార్యల్
విదితంబుగ బహురూపుల
వదలక రమియింతువౌర వసుధను కృష్ణా! 23

అంగన పనుపున దోవతి
కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా
సంగతి విని దయ నొసగితి
రంగుగ సంపదలు లోకరక్షక! కృష్ణా! 24

హా! వసుదేవ కుమారక!
కావుము నా మానమనుచు కామిని వేడన్
ఆ వనజాక్షికి నిచ్చితి
శ్రీవర! అక్షయమటంచు చీరలు కృష్ణా! 25

శుభ్రమగు పాంచజన్యము
అభ్రంకషమగుచు మ్రోవ నాహవభూమిన్
విభ్రమలగు దనుజసుతా
గర్భంబుల పగులజేయు ఘనుడవు కృష్ణా! 26

జయమును విజయున కియ్యవె
హయములు ములుకోలమోపి యదలించి మహా
రయమున రొప్పవె తేరును
భయమున రిపుసేన విఱిగి పాఱగ కృష్ణా! 27

దుర్జనులగు నృపసంఘము
నిర్జింపగఁదలచి నీవు నిఖిలాధారా!
దుర్జనులను వధియింపను
అర్జునునకు నీవు సాదివైతివి కృష్ణా! 28

శక్రసుతు గాచు కొఱకై
చక్రము చేపట్టి భీష్ముఁ జంపగ జను నీ
విక్రమ మేమని పొగడుదు?
సక్రాగ్రహా! సర్వలోకనాయక! కృష్ణా! 29

దివిజేంద్రసుతుని జంపియు
రవిసుతురక్షించినావు రఘురాముడవై
దివిజేంద్రసుతుని గాచియు
రవిసుతుఁ బరిమార్చితౌర రణమున కృష్ణా! 30

దుర్భరబాణము రాగా
గర్భములోనుండి అభయ కావుమటన్నన్
నిర్భరకృప రక్షించితి
వర్భకు నభిమన్యుసుతుని నచ్యుత కృష్ణా! 31

గిరులందు మేరువౌదువు
సురలందున నింద్రుడౌదు చుక్కలలోనన్
బరమాత్మ! చంద్రుడౌదువు
నరులందున నృపతివౌదు నయముగ కృష్ణా! 32

చుక్కల నెన్నగ వచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింపనగున్
జొక్కపు నీ గుణజాలము
నక్కజమగు లెక్కపెట్ట నజునకు కృష్ణా! 33

కుక్షిని సకలజగంబుల
నిక్షేపము జేసి ప్రళయనీరధి నడుమన్
రక్షక! వటపత్రముపై
దక్షతఁ బవళించునట్టి ధన్యుఁడ కృష్ణా! 34

విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపఁ దలచి విష్ణుడవనఁగా
విశ్వముఁ జెఱుపను హరుడవు
విశ్వాత్మక! నీవెయగుచు వెలయుదు కృష్ణా! 35

అగణిత వైభవ! కేశవ!
నగధర! వనమాలి! యాదినారాయణ! యో
భగవంతుడ శ్రీమంతుడ!
జగదీశ్వర! శరణు శరణు శరణము కృష్ణా! 36

మగ మీనమనై జలనిధి
బగతుని సోమకుని జంపి పద్మభవునకున్
నిగమముల దెచ్చి యిచ్చితి
సుగుణాకర! మేలు దివ్యసుంధర కృష్ణా! 37

అందరు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధిఁదరవ పొలుపున నీ వా
నందముగ కూర్మరూపున
మందరగిరి యెత్తితౌర మాధవ! కృష్ణా! 38

ఆది వరాహుడవయి నీ
వా దనుజు హిరణ్యనేత్రు హతుజేసి తగన్
మోదమున సురలు వొగడగ
మేదిని వడిగొడుగునెత్తి మెఱసితి కృష్ణా! 39

కెరలి యఱచేత కంబము
నరుదుగ వేయుటను వెడలి యసురేశ్వరునిన్
ఉదరము జీరి వధించితి
నరహరి రూపావతార! నగధర! కృష్ణా! 40

వడుగడనై మూడడుగుల
నడిగితివౌ భళిర భళిర! అఖిలజగంబుల్
తొడిగితివి నీదు మేనున
కడు చిత్రము నీ చరిత్ర ఘనమవు కృష్ణా! 41

ఇరువదొకమారు నృపతుల
శిరములు ఖండించితౌర! చేగొడ్డంటన్
ధర కశ్యపునకు నిచ్చియు
బరగవె జమదగ్ని రామభద్రుడ కృష్ణా! 42

